
మంజీరా రచయితల సంఘం

నందిని సిధారెడ్డి

# నదిపుట్టువడి

కవిత

**NADIPUTTUVADI**

**NANDINI SIDHAREDDY**

Collection of Poems

*Published by*
**Manjeera Rachayithala Sangham**
17-112, Thoombai, Srinagar Colony
SIDDIPETA - 502 103. Ph.: 08457-224877

*First Edition :* November 2007

*Cover Photo:* **Sasi Sekhar**

*Cover Design:* **Sita**

*Copies available at* **:**
**Visalandhra Book House,** Hyd. and its branches in A.P.,
**Navodaya Book House,** Badichowdi, Hyderabad,
**Disa Pustaka Kendram,** Chikkadpally, Hyderabad,
**Sahachara Book House,** Baghlingampally, Hyderabad.

*Composed at:* **Akshara Creators,** AG-2, A-Block, Mathrusri Apts., Hyderguda, Hyderabad. Ph: 23244088

*Printed at:* **Charita Impressions,** Azamabad Industrial Area, Hyderabad. Phones: 040 - 27678411, 55295078

Rs. **30.**


కవి
ప్రజ
తెలంగాణ
కలలధార
కౌముదికి

అరుణతార, వార్త, ఆంధ్రజ్యోతి
నేటినిజం, సాహిత్యనేత్రం, విపుల
ఈటివి-2, ప్రజాతంత్ర, కవితావార్షిక
కవిత, తెలంగాణ కవిత
**సంపాదకులకు...**

విరసం, మరసం, అరసం, ఝరీ
తెరవే, ఫీవర్స్‌ఫ్రంట్, వివిధ జిల్లాల
**సాహితీ సంస్థలకు...**

ఎపిటిఎఫ్, డిటిఎఫ్, టిఆర్‌టియు
టిఎన్‌జీవో, టీ
సంస్థలకు...

ఆత్మీయ మిత్రులకు

**కృతజ్ఞతలు**

జాగ మీద పానం
పానమిడిసినా జాగిడువం

ఈ జాగల
బర్వు బర్వుగ తిరిగే
పూర్వీకుల ఆత్మలుంటయి

# పుట్టువడి

**జా**గ తీరే అట్ల
ఈ జాగల రేషమున్నది
కుటిలం లేదు
కువారం లేదు
కుండబద్దలు కొట్టినట్టు
కడిగేసుడే ఎరుక
బాధయినా బరువయినా
ఎత్తుకున్నంక మోసుడే
జీవునం పోయినా సరే
జిద్దుకు నిలవడ్డం
ఇటు పొద్దు అటు పొడిసినా
ఇజ్జత్ ఇడిసేది లేదు
బట్టలు ఇడిసినట్టు
శరీరాన్ని ఇడిసిపెట్టేది ఆత్మ కాదు
ఎల్లెడల మనిషిని ఎడబాయనిదే ఆత్మ
ఉద్రాక్షపూలు పూసినంత సహజంగ
మాటలు పూస్తుంటయి

వరిచేండ్ల మీది గాడ్పువలె
స్వచ్ఛంగా
వాసన వాసనగా వచ్చిపోతుంటం

దాలిలో పాలు కాగబెట్టినవాండ్లం
అనుభవాలు కాగబెట్టి పోస్తం
పండ్లమ్మెతందుకయినా తండ్లాడుతం
చేదబాయి గిరక లెక్క
ఇరాం లేకుంట గిరిగిర తిరుగుతనే ఉంటం
గవ్వ ఆందాని లేకపోయినా
గాలికతలు ఎరుగం
ఎవలు కారని తెలిసినా
మేం కాకుంట ఉండలేం
ఎత ఎవలదయినా
ఏడ్వకుంట ఉండలేం
కోపం ఆపుకోలేక
నాలికయినా కొరుక్కుంటం

చావుదలకు సుత లేసి ఉరుకుడే
గెలిసినా ఓడినా
దిగిన తర్వాత కొట్లాడుడే
దిగుట్లె దీపం ఆరిపోయినా
నమ్మకం ఆరిపోదు

జాగ మీద పానం
పానమిడిసినా జాగిడువం
ఈ జాగ తీరే అట్ల
ఈడ పుట్టి పెరిగిన మనిషి తీరే గట్ల
ఈ జాగల
బర్వు బర్వుగ తిరిగే
పూర్వీకుల ఆత్మలుంటయి

*30 ఏప్రిల్ 2007, సాయంత్రం*



సేస్తిమి సేస్తిమి సెయిలన్ని పాయె
చేతుల కష్టం చేతికి రాకపాయె
మన్నుల మనాది వోకపాయె

# మనది మనకు

బత్కిన బత్కు
మల్ల బత్కరాదు గని
అడివిల పొద్దుగూకినట్టయింది బత్కు

ఎవల్లనని ఏం లాబం
నా పుట్టువడే గంత
బుద్ధి తెలిసినప్పట్నుంచి బుక్కాగులాల్ జల్లుకున్నట్టే

మన్నుల పొర్లాడితి
దుమ్ముల పొర్లాడితి
అడుక్కొచ్చుకున్న రాత అదేందోగని
చేతికష్టం చేతులకు రాకపాయె

ఎడ్డికాలం ఏడేండ్ల పోరన్ని
ఆరుసోల్లగాసానికి ఆపసోపాలు బడితి
అవ్వా అయ్యా ఆటలా పాటలా
చెలకల్నే చెడుగుడు
ఎగిలివారంగనే మొదలు బాదలు
మోటబార్లల్లనే పాటలు

తొండం బొక్కెన్లతోని తొమ్మిదెకురాలు పారియ్యాలె
నీళ్ళు మీదికి దెచ్చేతందుకు నీళ్ళు నీళ్ళయ్యేది పానం

పెద్ద పటేల్ మెచ్చుకుంటడని సెడ ఉరుకులాట
పటేలు 'ఎల్లిగా' అని పిలిస్తే పెయ్యంత పులకరం పుట్టేది
పెద్ద పటేలు పెద్ద జీతగాన్నయినప్పుడు సంబురమే సంబురం
పెండ్లయినప్పుడు సుతా అంత సంబుర పడలే

నీళ్ళ పారుకం నిగురానంత నాకే
శెర్వు కాల్వకాడ మేల్కొ ఉండాలె
కన్నుమూస్తె కాల్వ మల్పేటోల్లు
సిన్న పటేల్ జీతం మా సిన్నాయెనె కొడుకు
పెద్ద పటేల్ జీతం నేను
కాల్వనీళ్ళ కోసం కట్టెలు పట్టుకోని
ఎన్నిసార్లు కొట్టుకుంటిమి
పటేండ్లు మంచిగనే వుండిరి
పటేండ్ల కొరకు మేం తలకాయెలు పలగ్గొట్టుకున్నం
వాళ్ల పొలాలు పారెతందుకు మేం పేసీలు తిరిగినం

అడుక్కొచ్చుకున్న రాత అదేందోగని
సేస్తిమి సేస్తిమి సెయిలన్ని పాయె
చేతుల కష్టం చేతికి రాకపాయె
మన్సుల మనాది వోకపాయె

ఓట్లొచ్చె ఒనగారాలొచ్చె
వొంగి వొంగి దండాలొచ్చె
అదేమి ఇచ్చంత్రమోగని
ఇగ పటేండ్లే దండాలు వెట్ట వట్టిరి
పోరగాండ్లు పెద్దోల్లయిరి
భూమయితదంటె కమినిస్టోల్లకు జై కొట్టిరి



సర్కారు భూములిస్తదంటె పైరవి దిరిగితిమి
కాల్లరిగెదాంక అడ్డమైనోల్ల కాల్లల్ల పట్టుకుంటిమి
అంతల్నే అన్నలు పుట్టిరి
పటేండ్ల భూములు పడావు పెట్టిరి
సర్కారు పటేండ్ల పడావు భూమి గొని
పేదోల్లకు పంచింది
పటేలుకు పైసలొచ్చె
మా అసొంటొల్లకు భూములొచ్చె
భూమయితె దొరికిందిగని నీళ్లు లేకపాయె
నలుగురు పోరగాండ్లు పానశరం పట్టినా పదన పడకపాయె
అంజుమన్ బ్యాంకు అప్పిస్తదంటె అటు దిరిగితిమి
బాయిపొక్కల నీళ్లు పడకపాయె
బండపడె
మా బత్కుల తియ్యరాని బండవడె
అప్పులాయె
రెక్కల కష్టంబాయె
బాయి గాకపాయె
బాయి పాడుగాను
మా బత్కులు బర్బాద్ జేసె
పటేండ్ల యవుసం బొయి
పంతుల్ల యవుసమొచ్చె
పెద్దొల్లిద్దరు పెద్ద సార్ల దగ్గర జీతం కుదిరిరి
జీతం పెట్టువడి కింద యెయిలు దెచ్చిపెట్టిరి
మోటలు పొయి కరెంటు మోటర్లొచ్చె
బాయిలు వొయి బోర్లచ్చె
బాకికి చెరపొయి బోరేస్తిమి
నీళ్లు దుంకుతుంటె
ముసల్తనమైనా ఎగిరి దుంకాలనిపిచ్చె

బత్కులు మారినట్టే అనిపిచ్చె
సిన్నోడింత సద్వినట్టే సదివె
నలుగురి కండ్లు వడ్డయి
కుటుంబం నలుగుట్లె వడ్డది
నెత్తినోరు ఒక్కటి జేసి మొత్తుకున్న
ముసలోని మాట ముడ్డికి రాసుకునిరి
ఇంట్ల గోడలు మొలిసినయి
బోరుకాడ కాట్లమొద్దులొచ్చినయి
లో వోల్టేజి - మోటర్ కాలిపోవుడు
నీళ్లకాడ నిత్తె పంచాయతే
నీళ్ల కాడ నీళ్ల కంటె అన్యాలంగ నెత్తురు పారిచ్చిరి
ఎవలకు జెప్పాలె
ఎవన్నెటట్టున్నది
సర్కారుననెటట్టు లేదు
పొలగాండ్లననెటట్టు లేదు
ముసల్తనంల కొత్త ముచ్చెటినవడితి
మన నీళ్లన్ని
ఆంధ్రోల్లు మల్పుకపోతంటే
మనమిక్కడ తన్నుకుంటున్న మంటండ్రు
నీళ్లు మల్పినట్టే కొట్లాట మల్పిండ్రంటుండ్రు
నీళ్ల చాలాకి ఏరే ఉంటది
నీళ్ల తెలివి ఏరే ఉంటది
మనండ్ల మనం కొట్టుకునుడు గాదు
మనుసుల అర్తం జేసుకోవాలె
దునియ అర్తం జేసుకోవాలె
మనండ్ల మనం కొట్లాడుకునుడు గాదు
మనది మనకయెతందుకు కొట్లాడాలె



మనది కాని జీవితంతో
మనమేమీ రాయలేము

# తలవంచని గీతం

అవమానంలో కాలుతున్నాం
అల మీద కాలిడలేము
తడి జ్ఞాపకాల ఒత్తిడిలో
ఇంకా అక్షరం ఒడి తిరుగుతున్నది

రెండు అస్తిత్వాల నడుమ చంద్రోదయం కాదు

ఊడిన బండికమ్మి
ఎంత దూరమో పరిగెత్తలేదు
నదిని మోసుకుంటూ నడిచిన దారి
నాలుక తడపలేకపోయింది
ఆషాడపు వనభోజనాలు నాకింకా గుర్తు
ఆకులు కుట్టుకుని తినే సమయానికి
ముసురు ముట్టడించేది

అందమైన కల అందమైన అనుభవం మిగల్చలేదు

ఆఖరి కన్నీరు తుడువలేదు
కడుపులో అక్షరం ఎగదన్నుతున్నది
ఇప్పటికీ మనిషిని మనిషి వేటాడుతున్న దృశ్యమే

మార్కెట్ వేటాడుతున్న దృశ్యం అదనం
రెండు వేటల నడుమ రేషం సహజీవనం సాగించలేదు

మనది కాని జీవితంతో
మనమేమీ రాయలేము

భుజాల మీంచి జారిపోతున్న
మన నదిని
మన మునివేళ్ళతో
బిగబట్టుకొని నేలంతా మన గుర్తులు రాయటమే
అల మీద కాలిడదు
తల వంచని గీతం



వెదుక్కుంటూ వాన వొచ్చేసరికి
చెరువు
మిగల్లేదు

# కార్తె

గడిచిన జమానా
కల్లోలాలు తడుముకుంట
కండ్ల నీళ్లు పెట్టుకుంటది
వడిసెల తిప్పిన జాగల
ఆరుతడి అంటలేదు
కొసెడు నీళ్లకు
తౌసు దీస్తున్న గోరింకల గోస చెప్పాల్నా...

బురుజు మీంచి కూలుతున్న
గడియలు జ్ఞాపకాలు

చూపుల నడుమ
అదే చుట్ట

వెదుక్కుంటూ వాన వొచ్చేసరికి
చెరువు
మిగల్లేదు

*మన్నుకు నెనరుండె*
*మనుసుకు నెనరుండె*
*గట్టిగ లగాయించి పిలిస్తె గంగ పలికేది*
*కాలమే గిట్లొచ్చింది*
*ఎవనికెవడు పలకడు*

# బోరు దుఃఖం

ఆశ సారూ
కష్టమో నిష్ఠురమో
బతకాలె గద
భూమ్మీద పుట్టిమ్మరి
మంట్లె దిగినందుకు
పొర్లాడాలె గద
బోరు పడ్తదని
పోరగాండ్లు బతుకుతరని
ఆశ సారూ

కట్టుకుంటిమి
కంటిమి
సాదాలె గద

అందరి మాదిరి సంసారం ఇంత తెలివిజెయ్యాల్నని
ఆశ సారూ
కాలం పాడుగాను
కంట్లె నిప్పులు పోసుకున్నది



మస్తు కాలాలు జూసిన
ఇసొంటి కాలం జూల్లె
మన్నుకు నెనరుండె
మనుసుకు నెనరుండె
గట్టిగ లగాయించి పిలిస్తె గంగ పలికేది
కాలమే గిట్లొచ్చింది
ఎవనికెవడు పలకడు
ఒగనికంటె ఒగడెక్కువ

ఒక్క బోరు పడకపోతదా?

బొంబాయి సంపాదన బోరుపొక్కల వాయె
అప్పు మీద అప్పు
ఆత్మ మీద అప్పు
భూమిల తండ్లాడితె
భూమిలోతు దొరుకకపాయె
మనుషులల్ల తండ్లాడితె
మనిషి లోతు దొర్కకపాయె
రెక్కలుండి ఏం పలం
రేషముంటె ఏం అక్కెర
పోరగాండ్లు ఉపాసం పండే కాలమచ్చె
కన్నీళ్ళు తుడుసుకోవచ్చు
కడుపు సారూ
ఏదూకున్నా అదూకోదు

కట్టుకున్నది
నడుముకు కట్టుకున్న చీర
బిగదీసి కడుపుకు కట్టుకుంటంది

ఏంజేతు
యాడికి కాళ్లు జాపుదు

పడదని తెలిసి బొర్లెందుకేసుడంటరు
ఓడిపోతరని
మీరు ఓట్లకు పోకుంటున్నరా
వొస్తయోరావో తెల్వని నౌకర్లకు
పోరగాండ్లను నల్వకుంటుంటున్నరా
ఎవ్వలకయినా
ఆశ సారూ
బంగారం గాదు
బంగుల గాదు
బువ్వ సారూ
బుక్కెడు బువ్వ
మేం తిండిలేక జస్తంటె
తిన్నదర్గక జస్తున్నమంటరు
మీ నాల్కెకు మొక్కాలె
తిట్లకు జస్తున్నం
బతుకు సారూ ఎప్పటికి

*3 జూన్ 2004 రాత్రి*



మట్టికి జీవశక్తిని
మాటకు మంత్రశక్తి నిచ్చేది నీళ్లే

# నీళ్ల కోసం

సిగ్గుపడొద్దు గని
నాకూ అతనికి నడుమ
పిల్లబాట పిసుక్కోని నవ్వింది
తోతిరి తొంబయి తిప్పల
అన్యాలం గాల
అందరం ఒకటేననుకున్నను
నమ్మకాలు నడుమంత్రమువి
నియ్యతే నిజమనుకున్నను
నేను మట్టిని నమ్ముకున్న
అతను నీళ్లను నమ్ముకున్నడు

కాలికింది మట్టి
కటిక మట్టి అడుగుతీసి అడుగులేస్తంటే
ఎర్రమన్ను దుబ్బమన్ను పెయినిండ తీగ పారితే
కడుపుకింత దొరుకుతదని కలగన్న

అతను నీళ్లవెంట పడ్డడు
కాలువెట్ల కదిలితే
కాలట్ల పెట్టిండు

నేను కాలి కింద మట్టిని కండ్ల కద్దుకోని
కష్టాలు కడగండ్లు కలిసొచ్చినా ఊరిని ముట్టుకోనున్న

కొయ్యబారింది నేను
కాలవ పారింది ఆయన

ఊరులేదు ఊళ్లేదు నీళ్లు కొలిచింది అతను
మేడలు కట్టి ఊడలు దించింది తాను
అయిన కాడికి అప్పులు తేలేక
తాడు పాడెరాత రాసింది
చెరువెండిపొయ్యి
చెరువంత గుండెలెండి పొయ్యి
ఇంగ మాట పట్టన పలుగుతది
క్యూసెక్కులు కాదుగని
క్రిష్ణమ్మ కిసుక్కున నవ్వినపుడు సిగ్గుపడ్డను
గోదావరి కాలికి పైసలు కట్టుకొని ఆడినప్పుడు భంగపడ్డను

యాడ మొదలైంది కల
మట్టినీ నీళ్లను పాయగొట్టిన కువ్వారం
మనిషినీ మట్టినీ మాయజేసిన బొయ్యారం

ధనం దొంగిలించినోడు దొంగ అయితే
నీళ్లను దొంగిలించిన వాడేమయితడు

రక్తసంబంధం అడ్డంపెట్టి
కాళ్ల కింద నీళ్లను కాట గలిపిన తాన్నే మన కొట్లాట
నీళ్ల కోసమే మన కొట్లాట

మట్టికి జీవశక్తిని
మాటకు మంత్రశక్తి నిచ్చేది నీళ్లే
మనం పిలిస్తే పలికే నీళ్ల కోసమే మన కొట్లాట

*10 ఫిబ్రవరి 2003, ఉదయం*



మన నేల ఒకటే మన జాతి ఒకటే అయితే
మన బతుకులు ఒక్క తీరుగ ఎందుకు లెవ్వు
మన తల్లి ఒకటే అయితే
మాతృస్తన్యం మాకెందుకు దొరుకలేదు

# తెలంగాణే మా తల్లి

**అం**దమైన పూల తోటి
ఎంత మంచి సమాధి కట్టింగ్రు నా గొంతుకు-

మరిచిపోవటం
కొంత సుఖమూ కొంత దుఃఖమూ
తెలుసుకోవటమే పెద్ద అశాంతి

ఉంగరాల మెరపు రాళ్లు జిగేల్మన్నప్పుడు
ఏదో యాదికస్తది
తియ్యని చితుల కింద కాలిపోయిన
బొక్కల్లో
నా తల్లిని దేవులాడుతున్నాను

మాటకు రంగులద్దిన మాయలోడా
నీ కొంచెపుతనానికి
నా మాట మంచం పట్టింది గదరా
దోసెడు రక్తమిచ్చి
బతికిచ్చుకుంటా నా మాటను-

పోరాటం పురుడు పోసుకున్నోన్ని
కత్తితో కొట్లాడొస్తది
కపటబాజీతోనే కొట్లాడొస్తలేదు
కబ్జా
భూమ్మీదనే పెడ్తున్నవనుకున్న
మెదళ్ళ మీద కూచున్నవ్ గదరా

ఆయమ్మ చీరలు మార్చినట్టు
పార్టీలు మార్చిన మాయమ్మ
తుఫాను బాధితుల చీరలు దొంగిలించిన మాయమ్మ
సెంటిమెంట్లు మాట్లాడుతంది
భుజకీర్తులకు సెంగనెగిరిన మాయయ్య
సెంటిమెంటు సెడ ఒలికిస్తండు
కడుపు కాలి కాలి
మేం పాటెత్తుకుంటే
తెలుగుతల్లి ముక్కలయితదట
తెలంగాణ ఇంకా బక్కగయితదట
బతుకే ఉండదట
మా తల్లీ మాటలు నేర్చినవు గదవే
మనిషిని ముక్కలు ముక్కలు గోసినప్పుడు ఏమాయె
వోయయ్యా
నా కాళ్లకింద పంటపొలాన్ని అగ్గువసగ్గువకు కొని
ముక్కలు ముక్కలు చేసి అమ్మినప్పుడు యాడవోతివిరా
పెద్దల ఒప్పందాల చేతిలో చెయ్యేసి చెప్పిన బాసలు
కాకులకూ గద్దలకూ ఏసినప్పుడు ఏమైతివే
జిల్లాను పేజీ పేజీలుగా తెగ్గొట్టినప్పుడు యాడవోతివే మాయమ్మా
ఊరిని తుకుడలు తుకుడలుగా
లారీలల్ల కెక్కించినపుడు యాడవోతివే మా తల్లి



పొత్తునా పొద్దునా చిలకల్ల కొలికి
రాకురాకు బంగారుమైసి
చిలకపలుకులొద్దు
బంగారమడుగుతలేం
మాకు బువ్వ గావాలె
మా బువ్వ గావాలె

ఉప్పేసి పొత్తు కూడిన అయ్యలాలా
మీది సముద్రం ఉప్పు
మాది కన్నీటి ఉప్పు
మనకేడ కలుస్తది చెప్పు

శివరంజనీ అసావేరి రాగాల నీ పాట పరవశంలో మమ్ముల ముంచి
మా నీళ్లు దోసుకెళ్తిరి
మనోళ్లే కదా అని మా నోళ్లు కొట్టుకుంటె
మమ్ముల నీళ్ల కన్నా పల్చన చేస్తిరి గదరా
చేతులకు నూనె రాసుకొని ఉంటరు
మీరు మాకేడ దొరుకుతరు

పొగాకు గోదాములకూ
బొగ్గు బాయిలకూ ఢిల్లీ ఆస్మాన్ ఫరకుంటదిలే

కరెంటు దానం చేసి
మా మోటర్లు గాల్చుకుంటం
మీరేమో పొగాకమ్మి సారలమ్మి
మా మూలుగులు పీల్చుకుంటండ్రు గదరా
మన నేల ఒకటే మన జాతి ఒకటే అయితే
మన బతుకులు ఒక్క తీరుగ ఎందుకు లెవ్వ
మన తల్లి ఒకటే అయితే
మాతృస్తన్యం మాకెందుకు దొరుకలేదు

భారతం పుట్టిన భూమిల పుట్టిన అయ్యలారా
బద్మాసి తనమెవలది? దర్మతెవలది?
పలుకు పలుకున నునుగారాలు
బోల్తా కొట్టించేటందుకు బడె మాటలొస్తయి మీకు
తెలంగాణ అంటెనే తెలుగుతల్లి ముక్కలయ్యేదుంటే
ఆ బంధమే వొద్దు
సేపయి తల్లి మాకొద్దు
తెలంగాణే మా రక్తం పంచిన తల్లి
ఏత్తునా పోదునా శంకుస్థాపనలు
రాకు రాకు బంగ్గారుదేశం
కళ్ల ముందు ఊచలుంటేనే జైలు కాదు
మనసును కట్టిపడేసే మాట కూడా జైలే
షామియానా చెక్కులతో
నా హత్యలను కడుగలేవు
సమాధులు తవ్వుకొని నా మాటలు సరాయింస్తయి
జొన్నకర్రల జెండలు పట్టుకోని
సెలకలు జులూస్ తీస్తయిలే

*11 మార్చి 2001 ఉదయం*



మనమన్వేషించవలసింది
స్వర్గపు లోతులే కాదు
ప్రేమ లోతులు

# స్వర్ణ ప్రేమ

నీదీ ప్రేమే
నాదీ ప్రేమే
మనిద్దరి ప్రేమ
మరింత మధురం

*

వ్యూహాత్మకమైనా
దాహాత్మకమైనా
ప్రేమించగలిగితే
అధరాలు అతి మధురం

*

ప్రేమ ఎంత లోతయినదో
అంత గాఢమైంది

*

ప్రియా
నువ్వు చేతిలో చెయ్యేసి
గిల్లి నుదుటిమీద పెట్టిన ముద్దు
మరువలేను మరువలేను

సలుపుతున్న పుండు మీద
వెన్నపూస రాస్తుంటే
కండ్లు మూసుకొని మైమరిచిన
చీరుకపోయిన పాదాలకు
చెప్పులు తొడిగినప్పుడు
ఆత్మీయరాగానికి
వొంగి వొంగి సలాం చేసిన

*

చిత్రం కాదా మల్ల
పెదవుల మీద పెదవులానించి
ప్రేమగా ముద్దు పెడుతుంటే
ముఖం మీద కప్పిన
నీ నల్లటికురుల సందుల్లోంచి
మినుకు మినుకుమంటున్న జ్వాలలాంటి నీలి వెలుగులో
ముద్దు కంటే
ముద్దనూరుకు తరలి వెళ్తున్న
నా గుండెకాయ నా సింగరేణి ఆరడి పెడుతుంది
మెడ చుట్టూ జారిన
నీ స్వర్ణ బాహువులు
గాఢంగా అలుముకొని
నయగారంగా స్పృశిస్తుంటే
నాడీ పారవశ్యం కంటే
కాలవల చేతుల్లో తరలిస్తున్న
కృష్ణా గోదావరి జలాలు కుదిపేస్తున్నాయి
విప్పిన బట్టలు కుప్పబడి
మన తనువులు తహతహలాడుతున్నప్పుడు



పాములా బుసకొట్టిన
610 ఫైలు
బుట్టలో మూస్తున్న చప్పుడు బూర ఊదుతుంది

మాటల మధ్య పెద్దిర్కం
చూపుల మధ్య రెవెన్యూ

ముద్దూముచ్చట సరే
మాటా ముల్లే...

*

వ్యూహాత్మకమైనా
దాహాత్మకమైనా
ప్రేమ ప్రేమే

*

ప్రియా
మనమన్వేషించవలసింది
స్వర్గపు లోతులే కాదు
ప్రేమ లోతులు

*

రాజీ పడగలిగితే
ప్రేమ మధురమైందే

*

కాదనగలనా
నీదే ప్రేమే
నాదీ ప్రేమే

*23 ఏప్రిల్ 2002 ఉదయం*

సినీతారతో ఫ్లైవోవర్ మీంచి నువ్వు
నున్నగా జారుతున్నప్పుడు
పలుగురాళ్ల మీద ఆనెకాళ్లతో నడుస్తున్నాన్నేను

# ఒకటి కాం

రాజకీయం పొంగి పొర్లుతున్నా
చంద్రుడు సిగ్గుపడడు
నా మాటతీరు చూసి
నువ్వు నవ్వుతావు
మొగ్రలాజపురం కొండ నవ్వుతది

కరెన్సీ గుర్రం కదం తొక్కుతున్నా
సిద్ధార్థుడు సిగ్గుపడడు
నా కవిత్వం వరుస చూసి
చిలుక వెటకరిస్తది
ఏసీ కళాశాల గోడలు వెక్కిరిస్తాయి

ధవళేశ్వరం కట్టకింద
కాటన్ బతికే ఉంటడు
మంత్రోచ్చారణలో నీ సంకల్పం బతికే ఉంటది

నీళ్లు నీ పాలు
నేను ఆత్మహత్యల పాలు

సినీతారతో ఫ్లైవోవర్ మీంచి నువ్వు
నున్నగా జారుతున్నప్పుడు



పలుగురాళ్ల మీద ఆనెకాళ్లతో నడుస్తున్నాన్నేను
నీతో
నీడతో
ఒక మాటంట
'మన భాష ఒకటి కాదు
మనం ఒకటి కాం
కాలేం'

*21 మే 2003 రాత్రి*

మీరు మేఘాలు దిక్కు చూడండి
మేం నదులు తన్నుకుపోతాం
మనం కలిసి ఉందాం

# కలిసి ఉంటే కలదు...

పిట్టలేమైనా కానీ
పిల్లలెట్లన్నా పోనీ
మీరు మేఘాలు దిక్కు చూడండి
మేం నదులు తన్నుకుపోతాం
మనం కలిసి ఉందాం

చేను గలగల కానీ
చెరువులో తుమ్మలు మొలవనీ
మీరు చవగ్గా అమ్మండి
మేం భూములు కొంటాం
కలిసొస్తే కాలవలు మలుపుకుంటాం
కాకుంటే రియలెస్టేట్లయినా లేపుతాం
తమ్ముడూ, మనం సరదాగా కలిసుందాం

చుక్కలు కనబడనీ
సొరంగాలు కూలిపడనీ
మీరు బొగ్గు తియ్యండి



పవర్ జనరేట్ చేసి
మేం లాభాలు పంచుకుంటాం
కలిసుందాం తమ్ముడూ కలిసుందాం

పెద్దమనుషుల ఒప్పందం
పేపరూ సంతకాలే కదా
ప్రాంతీయ కమిటీ భ్రాంతిజనకమే గదా
అన్నింటికి మమ్మల్ని నమ్ముకోండి
అన్ని పదవులు మేం పంచుకుంటాం
అడపాదడపా పెదవులు తడుపుతాం
ఆరోవేలు లాంటి పదవి కోసం
అన్నదమ్ముల కలహమా
విశాలాంధ్ర విడిపోవటమా
కుటిల రాజకీయాల కోసం
మహనీయుల మధురస్వప్నం మసి కావలసిందేనా
తెలుగుతల్లి ముక్కలవటమా
లేదు లేదు మనం కలిసి ఉండాలి

తలమీద రెట్ట పడనీ
పిడుగులు పడి పిల్లలు చావనీ
చెట్టు కింది చదువులు చట్టుబండలు కానీ
మీ పిల్లలు రోడ్ల మీద ఆవారాగా తిరగనీ
మీ ఉద్యోగాలు మా పిల్లలు చేస్తారు
ముల్కీరూలు ముక్కిపోయిన ముచ్చట
ఆరువందల పది జీవో అందమైన నజరానా
భలేగా మలిచి అలమరలో అలంకరించుదాం
కలిసి ఉందాం సోదరా
కలిసి ఉంటే కలదు సుఖము

మేం ఫాంహౌజులు పెడతాం
మీరు వాచ్‌మెన్లుగా చేరవచ్చు
మేం భారీ కాంట్రాక్టు తెస్తాం
మీరు సబ్ కాంట్రాక్టులు చేసుకోవచ్చు
మేం పెట్టుబడులు పెడతాం
మీరు శ్రమను అమ్ముకోవచ్చు
మేం రకరకాల స్కీములు పెడతాం
మీరు రకరకాల అప్పులు చేయవచ్చు
అప్పుడప్పుడు ఆత్మహత్యలు చేసుకోవచ్చు
మేం టీవీలై పత్రికలై ఆ వార్తలమ్ముతం

ఇంకేం?
ప్రతి చిన్నదానికీ విడిపోవటమేనా?
వెలుగూ చీకటి
ఎంత గాఢంగా కలిసుంటాయి
మనమట్లా కలిసుందాం
కష్టసుఖాలు కలిసి పంచుకుందాం
మీకు కష్టం
మాకు సుఖం
కాదా, సుఖదుఃఖాలు కలిసి పంచుకుందాం
మాకు సుఖం
మీకు దుఃఖం

*22 మే 2004 రాత్రి*



ప్రజల కోసం పుట్టిన పార్టీ
పదహారు ముక్కలెందుకైనట్టు

# సూటిమాట

నిజమే, కామ్రేడ్
విడిపోతే బలహీనపడతాం
కానీ, మన పార్టీలెందుకు విడిపోయినట్టు?
ప్రజల కోసం పుట్టిన పార్టీ
పదహారు ముక్కలెందుకైనట్టు

కామ్రేడ్
సిద్ధాంతం ఒకటే
లక్ష్యం ఒకటే
రంగం ఒకటే
కానీ, మన పార్టీలెందుకు వేరయినట్టూ?

సందర్భమే కావొచ్చు
సంక్షోభమే కావొచ్చు

పార్టీలు చీల్చినం
ప్రజలను చీల్చినం
పల్లెలను చీల్చినం
వాడల్నీ గోడల్నీ చీల్చినం

ప్రతిభావంతులం కదా
ప్రతి చీలికకూ ఒక సిద్ధాంతం తొడిగినం

ప్రజలు సరే సమస్యలు సరే
పార్టీలు పదిలం
పదవులు మరింత పదిలం

నిజమే, కామ్రేడ్
నువ్వన్నట్టు
ప్రాంతాలు విడిపోతే
ప్రపంచబ్యాంకు బలపడుతుంది
మరి - మన పార్టీలు విడిపోతే
ప్రపంచ బ్యాంకు బలహీనపడుతదాండి?

నివద్దే
నువ్వన్నట్టు
చిన్న రాష్ట్రాలు ఏర్పడితే
కేంద్రం బలమైతది, మతతత్వం బలపడుతది
కామ్రేడ్
చిన్న పార్టీలు చిరు సంఘాలూ ఏర్పడితే
మతం చిక్కిపోతుందాండి?
కలిసిపోదామని ఆ పార్టీ చేయిచాస్తే
ఎలా కలుస్తామని జాడిస్తది నీ పార్టీ
అలనాటి ఆ వైభవం గుర్తు జేస్తరు

ఆస్తులు పంచుకుంటిరి
ఆఫీసులు పంచుకుంటిరి
పత్రికలు పంచుకుంటిరి చించుకుంటిరి
సంఘాలు జెండాలు గుర్తులు సగం సగం సదురుకుంటిరి



బలపడ్డరో భంగపడ్డరో తెలియదుగానీ
భవన్‌లు పదిలం
మన విజ్ఞానకేంద్రాలు పదిలం
గాలికి రెపరెపలాడే జెండాలు పదిలం
మన సిద్ధాంతం ఒకటి కావొచ్చు
మన వర్గం ఒకటి కావొచ్చు
మన ప్రయోజనాలు వేరు
మనం వేరు
పెన్నల్లిప్పిస్తామని
మా యోధుల్ని గుంజింద్రు
పుస్తకాలేస్తమని మా కవుల్ని బులిపిస్తుంద్రు
ఇండ్లిప్పిస్తమని మా ప్రజలు కండ్లు మూస్తంద్రు

మహోపాధ్యాయులు మీరు
మార్క్సిజం నమిలి మింగినవాళ్ళు
మాటలగారడి కరుడుగట్టినవాళ్ళు

బతుకు ఎల్లక మేం
వేరు బతుకుతామంటే
సిద్ధాంతాలు దట్టిస్తుంద్రు
వినివిని మా చెవులు మొరాయిస్తున్నయి
మా బతుకు మేం బతుకుతాం
మా చెవుల్లో పూలు పెట్టొద్దు

*5 మార్చి 2005 తెల్లవారుఝాము*

ఊళ్లకు ఉరిపెట్టటమే
అభివృద్ధి అయితే
ఆ అభివృద్ధిని నేను బహిష్కరిస్తున్నా

# ఆకాంక్షలు

వడగళ్లు కురవటమే
వానయితే
ఆ వానను నేను శపిస్తున్నా
ముక్కోపి అనుకున్నా ఫర్వాలేదుగని
వరిగొలుసులు పాడాలని కోరుకున్నాను

బురదలో పొర్లటమే
జీవితమయితే
ఆ జీవితాన్ని తిరస్కరిస్తున్నా
ఉన్మాది అనుకున్నా ఫరవాలేదుగని
పక్షులు ఎగరాలని కోరుకున్నాను

ఊళ్లకు ఉరిపెట్టటమే
అభివృద్ధి అయితే
ఆ అభివృద్ధిని నేను బహిష్కరిస్తున్నా
చాదస్తుడని చాటించినా ఫర్వాలేదుగాని
చెరువులు బతకాలని కాంక్షించాను



అయినవాళ్లకు వడ్డించటమే
పరిపాలన అయితే
ఆ పాలనను ధిక్కరిస్తున్నా
విప్లవకారుడనుకున్నా ఫర్వాలేదుగని
శ్రమ చిమ్నీ వెలగాలనుకున్నాను

ఆక్రమించే ఇకమతులే
ఐక్యత అయితే
ఆ ఐక్యతను భేదిస్తున్నా
వేర్పాటువాది ముద్రవేసినా సరేగని
మాది మాకు కావాలని సాకబోస్తున్నాను

*1 ఆగస్టు 2005 సాయంత్రం*

నా కృష్ణ నీ కాళ్ళల పడి ఎట్లురుకొస్తది
ముగ్గుల్ని చేసే దర్శకత్వం లేకపోతే
నా గోదావరి నీ వాకిట్ల ఎట్లాడుతది

# మౌనం పాటించలేను

మౌనం పాటించలేను
ముసలి నాయినలూ అవ్వలూ
కడుపు చంపుకుంటంటే
పాజిటివ్‌గా ఆలోచించలేను

మిఠాయిదేవే జల్లి గంటె చిల్లుల ముఖంతో వచ్చావు
చిట్టీల సైకిల్ చక్రవ్యూహంతో వచ్చావు
మాట ఒక్కటని మమకారం గుమ్మరించావు
ఎయిర్‌పోర్ట్‌పై
నా బతుకు భూమిని ఆక్రమించుకున్నావు.

మౌనం పాటించలేను
బీళ్లను సాగుచేసినవుగా
మెదళ్లను సాగు చెయ్యొస్తది
లేకపోతే నీ పాటకు పరవశించి
నా కృష్ణ నీ కాళ్ళల పడి ఎట్లురుకొస్తది
ముగ్గుల్ని చేసే దర్శకత్వం లేకపోతే
నా గోదావరి నీ వాకిట్ల ఎట్లాడుతది
నయగారంలో నీతో పోలలేను



ఆత్మహత్య చేసుకున్న నా రైతు మొకం చూడు
నీ కోల్డ్‌స్టోరేజి కొంటెనవ్వు నవ్వుతంది
రేషం లేని అవనత వదనంతో నిలవలేను

మంత్ర నిలయం గేటుకివతల
నా నిరుద్యోగ యువకుల
చిరకాల స్వప్నం కాలుతున్నది
నువ్వు తారుమారు చేసింది
ఒక ఫైలు కాదు
లక్ష తలరాతలు

నీకు సాగొస్తది
ఒడ్డున పడ్డంక ఎటయినా వాగొస్తది
మూడుకోట్ల మంది బతుక్కోసమడిగితే
వంద కోట్లమంది నడగాలంటవ్
అవు
హెలికాప్టర్ ఎక్కినపుడూ దిగినప్పుడూ సింగులు
సవరించుకున్నప్పుడు
ఎప్పుడన్నా వందకోట్లమంది నడిగినవా

కారెడ్డాల నడుమ కన్నీళ్లు వొత్తుకోలేను
మౌనం పాటించలేను
పైకెళితే దేశభక్తి ఒకే
కిందికొస్తే కులభక్తి ఒకే
ప్రాంతాభిమానం మాత్రం ప్రమాదమంటవు

మీ చతురత ముందు మేమేడ
ఒకరిది సమైక్యత
మరొకరిది జాతీయత
ఇంకొకరిది అంతర్జాతీయత

వైరుధ్యాల పరిష్కారం వంగతోటలో వదిలేశావు
భాష పేరుతో బ్రహ్మరాత రాస్తవు
భూస్వామికీ జీతగాడికీ భాష ఒకటేనా

సవాలక్ష సవాళ్లతో మౌనం పాటించలేను
అమరుల ఆత్మశాంతిక్కూడా
అరక్షణం మౌనం పాటించలేను
నిప్పులు చిమ్మే కంఠంతో మాట్లాడుతా
ఈ నీళ్ళు నావే
పగిలి పగిలి ఏడ్చే భూమి నాదే
నువ్వెన్ని మాయలు అల్లినా ప్యాకేజిలు చల్లినా
తెలంగాణ నాదే
ప్రజలు గర్జిస్తే ఇక
ప్రత్యేక తెలంగాణ

*29 జూలై 2005 సాయంత్రం*



ఆ మగువలు
మబ్బుల్ని
ఒంటి చేత్తో
బిందెల్లోకి ఒంపకపోతారా

# దాహం

కాగితమ్మీద
అక్షరం ఆలకుండా
రూపాయి కావలి కాస్తున్నది

మొఖమ్మీద
అరచెయ్యి మందంతో
దేశభక్తి మేకప్ చేసుకొంటుంది
సీతాకోకచిలుక గొంతు చుట్టు
నెలవంక ఉరి పేనుతుంది
వల పట్టుకోని బయల్దేరిన
వంతగాని విజన్లను
ఫ్లైవోవర్ చిత్రిక పడుతున్నది

మామిడితోటలో
కోయిల గానానికి కలతపడ్డవాడు
కత్తిసాము చేసుకుంట
స్లో మోషన్‌లో ఎగురుతాడు

ఆటపాటల ఆఖరికేకకు
హడావుడిగ మేల్కొన్న గడ్డిపోచలు
ఆకాశం దిక్కు నడిచిపోతయి

జరిగిన సామూహిక ప్రాణభంగాలను
ఎవరూ పట్టించుకోరు

మొలిచిన నిశ్శబ్దం ముందట
మోకాలి మీద నిల్చొని
ఏ అక్షరాన్ని శపిస్తవు
ఏ కవిని తులనాడుతవు?

మనసు చంపుకొని
మబ్బులు
దళారుల్లా వొచ్చిపోతుంటయి
కురిసెతందుకు మనస్కరించదు

ఖాళీబిందెలు పట్టుకొని
కాలం మీద దాడికి లేచిన
మగువలకు
మాటలేల? మనసేల
ఇనుపముళ్ళొగ లెక్కా?

ఆ మగువలు
మబ్బుల్ని
ఒంటి చేత్తో
బిందెల్లోకి ఒంపకపోతారా
నేను చూడకపోతానా

*6 జూన్ 2003 సాయంత్రం*



మనుషులు పట్నం బత్కవోతే
నెమళ్లు పల్లెకు బతుకొస్తయి

# దుస్స్వప్నం

ఇసుక కూడా లేని వాగులో
ఇంగలం పట్టుకొని నడుస్తున్నా
రైతు శవం కాలిన బూడిద
బావురుమంటూ నిన్ను చుట్టుకుంటది
కాళ్లకింద పగిలిన గాజులు
నిష్ఠూరంగా మాట్లాడుతయి
పాడె మీద
అవిసిన కలలు మోసుకుంటా
నలుగురు ఆడమనుషులు
నా యెనుకెనుకే నడిచివొస్తరు
నడువన్నా బిరబిర
ఆగితే అప్పులోల్లు అక్కడా తేలుతరు
సాపసింపులేమన్నా సరే సాగిపో
జీవితం సరే జిల్లేడు చెట్లు సరే
మడికట్లల్ల సర్కారు తుమ్మలు మొలుస్తయేమొ

మనుషులు పట్నం బత్కవోతే
నెమళ్లు పల్లెకు బతుకొస్తయి

నడువన్నా బిరబిర
వాగొడ్డు వలవల ఏడ్వొచ్చు
బావాజోడు బత్కనియ్యడు
కాడు మీద కాటిపాపలోడు పంటే
కదిలించలేం
ఖచ్చితంగా
కాడు నాదిగాదు శవంనాది గాదు
అయినా తడిబట్టలతో చిమ్మచీకట్లో
ఇంగలం పట్టి నడుస్తున్నా

నువ్వూ నేను ఈ ఆడమనుషులు
కాల్చుదల్చుకున్నది
బహుశా శవాన్ని కాదేమో...

*13 మే 2004 సాయంత్రం*



బతుకొక బలహీనత
దుమ్ముకు భయపడి
ఎంత దూరం పోతాం
బతుకంతా దుమ్మే గద

# పాలపిట్ట

ఒక పొద్దు
మట్టిని మనిదీర ముద్దాడకుంటె
చేపపిల్ల వలె
మనసు కొట్టుకుంటది
పూలమ్మినా
కట్టెలమ్మినా
ఇక్కడనే బతుకాలె
బతుకొక బలహీనత
దుమ్ముకు భయపడి
ఎంత దూరం పోతాం
బతుకంతా దుమ్మే గద

బండ్లబాటో పిల్లబాటో
కాలు ఆడాలె
రైతు వారసత్వం
వాన పడకపోయినా
మొగులు దిక్కు చూడాలె

ఎవరు రారని తెలిసినా
ఏడుపొచ్చిన చోటే ఏడువాలె
పేపరయినా ప్రేమయినా
పోగొట్టుకున్న తావులోనే
దేవులాడాలె
తీపి తలపులు నింపి
ఆత్మీయులిక్కడే అసహజంగా రాలిపోయారు
గాలి పులకించేటట్లు
ఇక్కడే పాడాలె
పాటొక బలహీనత

బొద్దింక మీసాలకు కత్తులు తొడిగిన క్షణం
మంకీ క్యాప్ చావుగంట కొట్టింది
వ్యాపార ప్రకటనలే కాదు
చావు ప్రకటన కూడా టీవీకి ప్రియం
కాని కాలం మీద
చెదిరిన ఊరు సంతకం చెయ్యాలె
ఊరొక బలహీనత

ఈ ఆత్మ పాలపిట్ట
పెసలు తిని ప్రేమలు తిని పెరిగింది
గుంపు చింతలు విడిచి వెళ్లలేదు
తలనొప్పయినా సరే
గుంపు చేసుకొని
కసిగా ఇక్కడే ఎగురుతుంది

*17 మే 2005 సాయంత్రం*



మట్టకు రాసిన బెల్లం నాక్కుంట
పిలగాడు ఉరుకుతుంటడు
పొదుపంతా మూనెసీసల నింపుకొని
తరలిపోతదా తల్లి

# ఆదివారం అంగడి

అప్పటిదాంక
అక్కడేమీ ఉండది
ఎండ చురుక్కుమనే సమయానికి
ఒకరొకరు చేరుకుంటరు
సైకిలాపి మూటవిప్పుకోని
నేల మీద అందంగ పేరుస్తడు
బట్టల దుకాణం

తట్టలో నుంచి
కూరగాయల దుకాణం దించుతది
తక్కెడ తాళ్ళు సరిచేస్తూ
తంటాలు పడుతదామె

అంగిలేకున్నా
అందమైన అంచుగోచితో
గొంగళ్ళు పేరుస్తాడా
అందరి దృష్టి దండెకడెం మీదనే
నడుస్తంటే
అటుకూటు తగుల్తది

మిరప వరుగు
రాశులు పోసి
అంత లయబద్ధంగా అమ్మటం
బహుశా అక్కడే చూడగలం
కొమ్ములు తిరిగిన పోడేలు తల
ఒక సంకేతం
అద్దాల తోపుడుబండి
తరచుగా అడ్డాలు మారుస్తూ
గంట కొడుతుంది
ఈగలకేం
జుమ్మని చుట్టుకుంటయి
మిఠాయి
మటన్ ఏదీ విడువయి
అంతకుముందు పొద్దున ఎవరూ లేరా
ఎండ కాగేసరికి
ఎంతమంది గుంపులు గుంపులు
ఆరాపడుదునా ఆదివారం అంగడి
పట్నంలో ఆదివారం దుకాణాలు మూస్తే
అక్కడ ఆరోజే దుకాణాలు
షెట్టర్లుండయి
షోకేసులుండయి
దుకాణాలు పడుతయి
మనుషులు విరగబడుతరు
మట్టకు రాసిన బెల్లం నాక్కుంట
పిలగాడు ఉరుకుతుంటడు
పొదుపంతా నూనెసీసల నింపుకొని
తరలిపోతదా తల్లి
పక్కకు తిరిగితే
పశువులంగడి
మేత మేస్తున్న బక్కెద్దుకు



కోతకమ్మే విషయమే తెలియదు
కైలు పోసిన గిత్తను
బ్యారగాడు అదమాయించి చూస్తడు
బర్రె పొదుగును ముట్టి చూసి
ముసలికాపు గిస కొడుతుంటడు
ఊరి రైతుల్ని బ్యారగాళ్లు
ఊకె అడుగుతుంటరు ఊకుంటరు
కొత్తగ కొన్న రైతుపగ్గాన్ని దాటుకొని
మాటిమాటికి పాతకాపు దిక్కే చూస్తది పయ్యావు
పుర్రుకొట్టే పసురాల్ని ఎవలూ అడుగరు
ఎద్దుపుండు మీద వాలి
కాకిగోల కాకిది
బ్యారగాళ్ల గోల బ్యారగాళ్లది
ఎల్లని రైతు కడుపుల దుఃఖం
ఎవరూ గుర్తించరు
దేశాలన్నీ గ్లోబు మీద గీతలుగనే గుర్తించబడుతున్నప్పుడు
అన్ని మార్కెట్లూ ఇంటర్నెట్లకు ముడుచుకుంటున్నప్పుడు
ఇదో ఇచ్చంత్రం
వ్యూహాలు లేవు
దాహాలు లేవు
అందరి అవుసరం అంగడి
పది రూపాయలకు వాళ్లిద్దరు అరుచుకుంటున్నారా
జరసేపట్ల మాయం
ఉద్రేకాలు క్షణికమే
ఉపాయాలు క్షణికమే
దుఃఖాలుండొచ్చు
దుకాణాలుండొచ్చు
చీకటి చిక్కబడుతుందంటే
అక్కడేమీ ఉండది

*27 మే 2004 మధ్యాహ్నం*

గట్టిగ కండ్లు తెరువ్
కాలువ భయపడి పారుతది
మబ్బు మబ్బిడ్సి
నీ కాళ్లు కడుగుతది

# పనగడ

పనగడ తియి
పశువులు నీ దిక్కు
ఎంత ప్రేమగ చూస్తున్నయి
వాని మాటలు తునాతునకలు
తియ్ పనగడ
నెత్తికి చేతులు పెట్టుకొని
కుమిలేదేంది?
బడికి పోక గడికి నీ మొఖం చూసే
పసిపోరల మొఖం జూడు
బాధకు పసరు మందు బాల్యమే
లెవు
రుమాలు దులుపు
అవమానాలు రాలిపడ్తయి

మనసు చెమటపట్టింది తుడుచుకో

చెట్టు పెంచేతందుకు
నువ్వెంత కష్టపడ్డవు



వాన పడకపోతె
చేను వడలకముందే
నువ్వు వడలిపొయినవు

వాడు రోడ్డుపట్టి సంపాయించిండు
లారీ తెచ్చి సంపాయించిండు
బోరుమిషన్‌తోని బంగ్ల కట్టిండు
జన్మంత పొర్లాడినా
జరంత మిగలకపాయె
నువ్ కొలిస్తెనే కద వాడు పెరిగిండు
ఆకు తొక్కినట్టు
వాని మాటలు బురదల తొక్కు
మోకాళ్ల సందు మూగతనమేంది?
సరాయించు ఒక్కసారి
చెట్టు వొంగి చెయి జాపుతది

దుర్మార్గం వానిది
దునియంత నీ దిక్కున్నది
దుఃఖమొద్దు
నీళ్ల కొరకు
బతుకే కన్నీళ్లా?
గట్టిగ కండ్లు తెరువ్
కాలువ భయపడి పారుతది
మబ్బు మబ్బిడ్సి
నీ కాళ్లు కడుగుతది
నువ్ ధరించి దారొంచితేనే
లోకం బతుకుతున్నది

అన్నం పెట్టినవు నువ్
వాడు అప్పు పెట్టిండు

నీది దయ
వానిది మాయ
బట్ట పొట్ట భూమి చెమట
అన్నీ దానం చేసినవు
ఆత్మదానం చేసుడేంది?

ఎవుసం పట్టు తెలిసినవాడివి
బతుకు పట్టు గ్రయించు
కొట్టంలో ఉండాల్సినవాడు
ప్రపంచం ఏలుతుండు
పశువులు విడిచి
వానికి పనగడ వెయ్

*28 మే 2004 ఉదయం*



గెజిట్లు గాలించినా చరిత్ర వడకట్టదు
ఈ మట్టిల రాలిన ఏ ఆకును ముట్టుకున్నా
నెత్తురే అంటుతది

# మెతుకుసీమ విలాపం

సైకత ఛాయల మీద నిలబడి
చారెడు కన్నీల్లకు ఏడుద్దును గద
దోసెడు నీళ్ల దొరుకవు

మాటలు గాథల్నే తప్ప
బాధల్ని మోయలేవు

త్రిలింగదేశానికి మెతుకు పెట్టిన సీమ
తెల్లవారని చీకట్లో తెల్లబోయింది
ఏడువేళ్ల విస్తారంగా చాచి
తెరచిన అరచేయి నా మంజీర
వరిమొవ్వుకు తీపిబువ్వ పెట్టిన మంజీరా
ఫ్లైవోవర్ పొడవాటి నాలుకల కింద
హైహిల్సు దవుడల కింద బందీవైనావా

జీవనది వానకాలం నది అయిందని ఎవరికి చెప్పాలె

పారే చల్లటి ఏటిపాయలు
వరదకాల్వలయిన వైనం భయపెడుతది

మెదక్ ఖిలా మీదికెక్కి
దోసెడు మట్టి తీసుకొని కండ్లకద్దుకుందును గద
కమిలిన పాదముద్రలు దొరుకవు
కాకతీయుల కదలికల వెనుక ఎందరు
పూర్వీకులు నడిచారో
ధూళికణాలు పురాస్మృతుల పరిమళం వీస్తయి
భగ్నమైన 'బృహత్కథ'లో అడుగుల చప్పుడు
విగ్రహంలో బతికిన జైనం
గ్రంథాల్లో శిథిలమైన చప్పుడు
కాళిదాసును కాపాడిందిగానీ
సంజీవనీ వ్యాఖ్య కన్నతల్లిని పాడలేని మనాది

నిజాంను నిలదీసిన శంకరమ్మ
కోటలో గర్జిస్తున్నదింకా
శరీరం మీద బొడిపెలు కట్టినట్టున్న
ఫ్యాక్టరీల మధ్య నిలబడి
శ్వాసెడు గాలి పీలుద్దును గద
పొట్ల చెరువు పోలికే ఉండది
తెలతెలబోయిన తెలగన్న
వేదాంతపు వెర్రినవ్వు నవ్వుతుంటడు

అమాయకపు జానపద ప్రేమలా పరుచుకున్న
పుల్లూరు బండ మీద కంకెడు రాయిని కదిలిద్దును కద
సిద్దుల జాడ దొరుకది

కోమటి చెరువుల దిగి కో అంటే
బతుకు అమ్మలు బరువు బరువుగ
అలుముకుంటరు

ఏమీ మిగల్లేదు
గెజిట్లు గాలించినా చరిత్ర వడకట్టదు
ఏమంటం?
ఈ మట్టిల రాలిన ఏ ఆకును ముట్టుకున్నా
నెత్తురే అంటుతది

*12 అక్టోబర్ 2003 తెల్లవారుజాము*



మనిషి సంచరించిన జాడలన్నీ
గుర్తించవచ్చు
మనిషినే గుర్తించలేం

# సంకేతం

ఊడుగు చెట్టు కింద
ఊరిమనిషి
విశ్రమించి వెళ్ళిన జాడలు

మట్టి ముద్రలు మాట్లాడవు
మానవస్పర్శను
నెమరువేస్తున్న చెట్టుతో
జ్ఞాపకాలు పంచుకుంటయి

మనిషి లేడు

బాటలో కాటగలిసినవాడు
బతికున్నడో లేడో చెప్పలేం

పర్రెలు పెట్టిన పెద్దబావిలో
అతను వొంగి
దోసిలితో నీళ్లు తాగిన జాడ

ఒక బండ
ఒక జ్ఞాపకం

రెండు పాదాల సందున ధోతి మడేసి
పిండిన గురుతు లేవేవో అక్కడ

గుర్తులకేం?
బోలెడు చెప్పొచ్చు
మనిషి సంచరించిన జాడలన్నీ గుర్తించవచ్చు
మనిషినే గుర్తించలేం

కత్తి పట్టుకొని కాలం
కలల కుత్తుకలు తెగటార్చుతుంటే
మానవమాత్రుడేం చెయ్యగలడయ్యా

ఊరే పొమ్మంటంది
కాడు రమ్మంటుంది

నాలుక మీద నాలుగు బీజాక్షరాలు రాసిన
ఊరు బయలెల్లుతుంటే
ఎవలకయినా పలపల ఏడుపొస్తది

నడుమ నడుమ
సంటి పిలగాడు ఏడ్చినట్టు ఏడ్చే
నాగలిని ఓదార్చలేం

మనిషెటు దానమైనాడో చెప్పలేం

మనుషులుంటెనే గదా ఊరయింది
ఊరి నుంచి మనిషిని ఎడబాపిన
జగన్మాయ
ఒక వెర్రినవ్వు నవ్వుతుంది

అదీ గుర్తే

*6 జూన్ 2003 సాయంత్రం*



ఒక మాటల శిల్పం ముందుకొచ్చింది
లోకంలోని
ప్రాణశక్తులన్నీ తెల్లబోయినయి

# అరువు

ఆపద కొత్త కాదు
తన చెమట వలె
కష్టం కూడా కొత్త కాదు
కొత్తగా కాలం అమ్ముడువోయి
కష్టాన్ని అవమానించింది
పనిని పక్కకు జరుపుతూ
ఒక మాటల శిల్పం ముందుకొచ్చింది
లోకంలోని
ప్రాణశక్తులన్నీ తెల్లబోయినయి

*28 మే 2004 ఉదయం*

చెట్లే నయం
పటువలతో నీళ్లు పోసినందుకు
పతాకం పలకరిస్తయి

# బాపు

తను
చరిత్రను
తవసు వట్టిన కాలం

అనుకొని
పూలు పూయవు
మనం ఆడిపోసుకున్నా
ఆ చెట్టు
అల్లనేరేడు పండ్లే కాస్తది

బరివాతల ఆ బక్క భుజం
నాగలి మోసింది
నాటుతుపాకీ మోసింది
ఊర్కోలేక ఊరు ఉద్రేకాలను మోసింది
కోటి ఆయాసాల కగగండ్లు కొనగోట ముట్టింది

నీకూ నాకూ ఏం తెలుసు
చొక్కాలు విడిచేసినట్టు
హృదయాలు విడిచి ఒరకు పెట్టినం గదా



నెత్తురోడే కత్తుల సంచి
కాలువెట్టినప్పుడు
ఊరెంత కొట్టుకుందో గద

కలువ రాలేదని
నాగెల్లి రోజు బిడ్డ నెత్తుకపోతే
వాడ కట్టెంత వలపోసిందో మరి

పటేండ్ల మీద తొడగొట్టి నిలిచిందాయెన
పుంగిల రింగుమంటున్న పాటరేషం ఆయెన
అక్షరాలు దిద్దని నాల్కె మీద
చరిత్ర కదను తొక్కుతది

ఒంట్లె కలిగిందంత భూమిల వోసి
భూమిల కలిగిందంత అప్పులు గొలిసి
పిల్లల మీద పడి గొల్లుమంటడు
ముఖం మీద
కష్టాలు ముడుత పడుతయి
బొమిడికం పెట్టిన పాత ధోతి ఆయెన
ఎవరు చివరి శ్వాస విడిచినా
ఆ వాకిట్ల అంత్యక్రియల ఆందోళన తను

ఆ స్వరం పదూర్ల పెట్టు
బయటి ప్రపంచం ఆయన భద్రపర్చిన కల
కంకి కొడవలి కార్డులో
కన్నీళ్లు దాచుకుండు
అరచేతుల మీద తాళ్లు పేనినట్టే
ఆశలు పేనుకుండు
ఇప్పుడా తాళ్లు చీకిపోయినయి

బాటలు ప్రయాణాలు పరుగులు పెట్టి
ఇప్పిపెట్టిన కచ్చురం ఆయెన

తను రాంగనే
తాడిచెట్టు వంగివంగి
కలతలు పంచుకుంటది
'సిస్టమ్'ల స్థిరపడ్డ మనమేం పంచుకుంటం
చెట్లే నయం
పటువలతో నీళ్లు పోసినందుకు
పతాకం పలకరిస్తయి

అనుకొన్నా ఆకు రాలదు
కూచుంటూ లేస్తూ పాత కుర్చీలో ఒక చరిత్ర

'ఏం కూడబెట్టిచ్చిండు పిల్లలకు...'

'లోకం లోతు
ఇంత రేషం
ఇన్ని కన్నీళ్లు
తలెత్తుకున్న చరిత్ర
వొడువనిదే ఇచ్చిండు
చాలదా...'

*9 అక్టోబర్ 2005 రాత్రి*



మౌనంగా మాటలు కట్టుకో
డబ్బు కూడగట్టుకో ఫర్వాలేదు
మనుషుల్ని కూడగట్టకు

# ప్రజాస్వామ్యం

ఓ మూల
ఒదిగి కవిత్వం రాసుకో
కదిలితే ప్రమాదం
బొటనవేలు నరికివేయొచ్చు
ఏదో
మౌనంగా మాటలు కట్టుకో
కొంచెం ఎక్కువే డబ్బు కూడగట్టుకో ఫర్వాలేదు
మనుషుల్ని కూడగట్టకు,
ప్రమాదం!
క్రాస్‌రోడ్‌లో కాలు విరుగొచ్చు

అచ్చొత్తుకో
అవార్డులందుకో
శాలువలు చాలినన్ని కప్పించుకో
ఏం ఫర్వాలేదు
న్యాయం వైపు నిలబడకు
ప్రాణానికే ప్రమాదం!

*22 మే 2004 అర్ధరాత్రి*

రాగి తీగే కాదు
మనిషి కూడా
షాక్ కొడతడు

# చక్రం

## షాక్
ఎట్లుంటదో
కంప్యూటర్ ముఖం మాడిన
నల్లటి క్షణం బాగా చెప్పగలదు

ఒక కోపం
ఆయువుపట్టు మీన
ఫెటిల్లున తన్నిన చప్పుడు మరింత బాగా వినొచ్చు

బంగారు బంగులల
రాజహంసకు నొప్పి పెడుతదా
పెడితే అది తప్పకుంట రంగుల్లో ఉంటది

ఆత్మహత్యలను ఎగతాళి చేసిన ఇరవై ఇరవై
నిను కమ్మిన నీడను
నింపాదిగా విశ్లేషించుకో
నీదీ ఆత్మహత్యే!

ఒకసారి కొందరి గురి తప్పినా
అన్నిసార్లు అందరి గురి తప్పదు.



రాజీనామా పత్రమే చావు ప్రకటన

అక్షరాలా రాజీనామా సమర్పిస్తున్న దృశ్యంలో
ఎన్ని కండ్లు మెరిసినయో

ఆకలిని పరిహాస మాడినవు గదా
కడుపుమంట ఊకుంటదా
పోలీస్ కంట్రోల్‌రూంతో
కాలాన్ని నడుపగలననుకున్నవ్
మీడియా మాయతో మేనేజ్ చెయ్యొచ్చనుకున్నవ్
కాదన్న కవికి సరిహద్దురేఖ గీసినవ్

ఏమయింది
ఢిల్లీలో చక్రం తింపొచ్చు గాక
విరిగిన బండి చక్రం
నీ బతుకు చక్రం దింపింది

మనిషిని మించిన
విప్లవమేదీ లేదు

రాగి తీగే కాదు
మనిషి కూడా
షాక్ కొడతడు
ఒప్పుకుంటవా

*11 మే 2004 మధ్యాహ్నం*

*గదవ పగలగొట్టి*
*గాయాల్ని ఎజండా మీదికి తెచ్చారు*
*కిరీటాలు తీస్తారు పెడతారు*

# ప్రజలు ప్రజలే

వాళ్లను దించారు
వీళ్లను దించారు
తప్పకుండా ప్రజలే గెలిచారు

ఎవరెక్కారన్నది సత్యమే
ఎవర్నయినా దించగలమని
మరోసారి నిరూపించారు
మన్నించాలి మిత్రమా
ప్రజలే గెలిచారు

పనిని పనికిరాకుంట జేసిండు
బతుకు నక్కదువ్వ జేసిండు
హృదయాన్ని పోపుడబ్బా జేసిండు
నరకాసురున్ని విన్నారు
నిజాంను చూశారు
ఇంత మాయగాన్ని
ఇంతకు ముందెప్పుడూ చూడలే

రైతులు
కార్మికులు
ఉద్యోగులు



మహిళలు
కులవృత్తులు
లోపల్లోపల బదులుకున్నారు
లోకం బీరిపొయ్యే మీట ఒత్తారు
చక్రం మీకే కాదు
మాకూ తిప్పొస్తదని చూపారు
తమాషా చూసినవాళ్ల
తమాషా తీశారు
ఔనన్నా కాదన్నా
ప్రజలే నిర్ణేతలని ప్రకటించారు
ఎవరెక్కారన్నదీ ముఖ్యమే
ఎక్కించటానికి ఎవరున్నారన్నదీ చూడాలి
తాలైనా అంగట్లో ఉన్నప్పుడు
ఉన్నదే ఎంచుకోవాలి

ఏ ఆపతైనా
ఎదుటి వాళ్లతోనే దించుకోవాలి
ఐచ్ఛికం అర్ధసత్యం
అందుబాటే నిజం
తిరస్కరించటానికే వీలు
తిరస్కరించారు
ఉసురు పోసుకున్నవాణ్ణి
ఉనుక కంటె అధ్వాన్నం చేశారు

గదవ పగలగొట్టి
గాయాల్ని ఎజండా మీదికి తెచ్చారు
కిరీటాలు తీస్తారు పెడతారు
ఎప్పుడైనా
ప్రజలు చేయగలిగింది
చేసి తీరుతారు

*15 మే 2004 రాత్రి*

కాళ్లసేతులు గుంజుతయని పంటే
కడుపు గుంజుతది గద

# కాబూస్

దారి మూసుక పోతున్నప్పుడు
చప్పుడు కాకపోవచ్చు
కన్నీటి చుక్క రాలి
మట్టిల కలిసిపోతున్నప్పుడు
చప్పుడు గాకపోవచ్చు
చటుక్కున ఒక పోగు తెగిపోయినప్పుడు
ఎంతమాత్రం చప్పుడు కాకపోవచ్చు

విషాదం మోయలేము
ఇతరులకు పంచలేము
అలవాటయిన చప్పుడొక్కటే
ఇష్టమయినా కాకపోయినా చప్పుడొక్కటే
చెవులేమైనా అదే చప్పుడు
పేగుల చప్పుడు
గుండె చప్పుడు కూడా ఇక వినిపించదు

మరమగ్గాల కింద
నుగ్గునుగ్గయిన
గుంట మగ్గం ఈ రొదలో ఎవరికీ వినిపించదు



అచ్చులతికినట్టే
ఆత్మలతుక్కోవాలె
బతుకంటే ఏం లేదు
తొక్కుతున్న రెండు కాళ్లు
కదులుతున్న రెండు చేతులు
చూపు తెగినా పోగు తెగొద్దు
గుంటలో దిగినా
ఎత్తు మీద కూచున్నా
కూలుతున్న శిఖరాలు ఆగయి
కాళ్లసేతులు గుంజుతయని పంటే
కడుపు గుంజుతది గద
బలమైన ల్యాక బద్దలు
మనిషిని నిలబెట్టలేవు
రుతువులు మారిపోవచ్చు
ముడుతలు దేరిపోవచ్చు
కనుగుడ్ల లోపల
వాడి తిరుగుతున్న కొన ఆశలు వీక్షించవచ్చు
ఊపిరితిత్తుల్లోంచి
దగ్గుతూ తొంగిచూస్తున్న
కాబుస్ కాటేసే క్షణాన్ని పసిగట్టలేం
మూరెడు బట్ట కింద
మూడు ప్రపంచాలు కాచుకున్నయి
కాటిక్కాచుకొన్నవాణ్ణి కనికరించయి
వర్తకానికి ప్రపంచమంతా ఒకటే
బట్టాలేదు బాతా లేదు
బతుకులవిసి బజాట్ల కలిసినా ఫరవాలేదు
మనిషా యంత్రమా కాదు
గొంతు తెగినప్పుడు పెద్ద చప్పుడు కాదు

ఇప్పుడంతటా ఒక్కటే
నోట్లు లెక్కిస్తున్న చప్పుడు
అయితే
చిన్నపాప
రాట్నం తిప్పే చప్పుడు
నాకు మరింత స్పష్టంగా వినిపిస్తున్నది

*2 అక్టోబర్ 2004 తెల్లవారుజాము*



పిల్లలకు రాజు గురించి
రైతులకు రాజ్యం గురించి
చెప్పిండు

# ఆర్తి

ముళ్లేంది?
మనుషులు నడిచే తొవ్వల
పూలు పరుద్దామనుకున్నడు
ఒక్క ఎండపొడకే వడలిపోయే
పూల ఆత్మలకు
ఎండాకాలం గురించి చెపుదామనుకున్నడు

బెత్తాలేంది?
పిల్లలు ఆడే తోటల
పిల్లనగోవినవుదామనుకున్నడు
నాలుక మీద
నాలుగు కాలాలు పండే పద్యం నాటాలనుకున్నడు

ఒక బాడిస
రైతులకు నాగలిదుంపను
పిల్లలకు మూడుగీరల బండిని
కానుకగా ఇచ్చే సమయానికి
ట్రాక్టర్ ప్రవేశిస్తుంది

పిల్లలకు రాజు గురించి
రైతులకు రాజ్యం గురించి
చెప్పిండు

తల్లులు శోకించే తండ్రులకు
ధీమయిండు
చెంచు పెంటల కొమ్ము మీద
మంచుజెండను కలగన్నడు

సంపాయించుడేంది?
ఒక ఆర్తితో రెండు చేతులా
జీవితాన్ని కావిలించుకున్నడు
భూమి పులకించింది
కాలం ఓర్వలేదు

పద్యాన్ని పాము పగబట్టింది
నీతివాక్యాన్ని వేటకొడవలి వెంటాడింది
భూమి గజగజ వణికింది
పాఠశాలలో హోరెత్తాల్సిన పద్యం
బజార్లో విలవిల్లాడింది
ఆకాశం అంతా చూసింది పలకలేదు
చెట్టు చెప్పలేదు
చెప్పగలిగి మనుషులు మాట్లాడలేరు

నిస్సిగ్గు రాజ్యం
పద్యాన్ని ఓర్వలేదు
నియంత నీతివాక్యాన్ని తట్టుకోలేడు
పాదయాత్ర పదవికి కొత్తది కాకపోవచ్చు
పదిలం పదిలం అని పదేపదే మిత్రులకు చెపుతనే ఉన్నం
ప్రాణం బలిపెట్టి పద్యం చెప్పిందదే
సిరా ఉన్నంతవరకు జీవి ఉన్నంతవరకు
పద్యాలు పుడుతనే ఉంటయి
విత్తు పగిలినపుడు పుట్టే పద్యంలో
చారీ... నువ్వే...

*(కనకాచారికి విచారంతో...)*

*28 ఫిబ్రవరి 2006 సాయంత్రం*





# నది సంతకం

మలుపులు మస్తున్నా
నది సంతకం
ప్రవాహమే
పిట్టలు మిగిలిచ్చిపోయిన
కిలకిలా రావాలే
చెట్టు సజీవ చరిత్ర

మడిచిన కాయిదంలో
ఏ సుప్త అనుభవాలు మథన పడ్తున్నయో
గుప్పిటకు తెలియకపోవచ్చు

గుర్తు పెట్టుకోదగిందే జీవితం

కట్ట చుట్టు తిరుగాడుతూ
కల్లోలమైన నీ ఒంటరి దుఃఖాన్ని
భైరవపురం చెరువు
బహుశా ఎప్పుడూ మరువకపోవొచ్చు
మంచులో తడిసి ముద్దయిన
చెంచుగూడాలు

ఒక కుంపటి ముందు మూగగా ముడుచుకుంటయి
ఎముకలు దేలిన శరీరాలు
కడుపు దేవిన క్షణాలు
ఆత్మలను అల్లుకొని
అట్లా వ్యాపించేదే జీవితం
సైనికులు వేటాడుతున్నప్పుడు
పశువులు కాపాడిన ప్రస్థానాలు
దొడ్డి గోడ దాటుతున్నప్పుడు
జారిపడిన రాయి
తుపాకీ మోస్తున్న నీ భుజాన్ని
లాలనగా మందలిస్తది
అడుగులో అడుగు వేస్తూ దౌల్తాబాద్
చీకటి నిశ్శబ్దాన్ని చిత్రిక పడుతది
సందులోనా సంపెంగలోనా
సార్థకమయిందే జీవితం

రాయిని కూడా అరగదీసే
అతని చిరునవ్వులో
నీ స్పర్శ దొరికేది
కాగితానికి హృదయాన్ని అతికే
ఇతని కవితల కిందా
నీ చూపు తాకేది

యూనిఫారంలో
చీరలో
చంద్రబింబం చంద్రబింబమే
చీకటిలో వెన్నెలలో
శత్రువు కంతు పట్టదు



మలుపులెన్ని తిరిగినా
నది సంతకం ప్రవాహమే
అడవి నడి పాపిట చిక్కుతీయటమే సాహసం
ఏ జామో
పక్షి తప్పుగా కూసింది
రహస్యాక్షరాల మీద
ప్రాణం పట్టుదప్పిన ధ్వని వినిపించింది
కంట్లో దుమ్ము పడినట్టు కలత మొదలు
నా రెండు చేతులు తెగి కన్నీళ్లు తుడుచుకోలేనిప్పుడు
ఎదురుంగ కదిలే నదితో ఓలలాడలేనిప్పుడు

ఉన్నా లేకపోయినా
మిగిలిపొయ్యేదే జీవితం

*(సుగుణారాధ సంస్మరణ)*

*10 అక్టోబర్ 2004 ఉదయం*

*కవిని అదృశ్యం చేసే శక్తి*
*ఏ రాజ్యాంగానికీ లేదు*

# కాంతిధార

దుఃఖానికి ఇవతలప్పుడు
ముసుగు తీసినా
ముఖం కనిపించది
లోపలెక్కడో సుడులు తిరుగుతున్న
వాక్య శకలాన్ని
లై డిటెక్టర్ కనిపెట్టలేదు.

నా ముఖాన్ని
నేను కడసారి చూసుకోనియ్యకుంట
లోహనేత్రం కావలి కాస్తది.

వాహనం దించి
ఒక్కొక్కరిని పేరడిగి
జేబులన్ని కాగితాలన్ని బొర్లించి
ఏ అక్షరం రాసుకొంటవు,
నా దగ్గరున్నయన్నీ అక్షరాలే!

పుట్లకు పుట్లు పుట్టే ఉసిళ్లపుట్ట- కవి
కవిని అదృశ్యం చేసే శక్తి
ఏ రాజ్యాంగానికీ లేదు



ప్రేమకు ఇవతలప్పుడు
నా ప్రియమైన ముఖాన్ని
కండ్లార చూడకుంట నువ్వాపలేవు
మనసును గుల్‌దస్తా చేసి
ముఖం మీద పెట్టి వచ్చాను తెలుసా
అక్షరం కోసమే ప్రాణం తీసినవు
ఇపుడెంతమంది పసరుపాటలు రాసింద్రో
నువ్వేసిన రోడ్డు మీద
నా యువ మిత్రుడు
కుంకుమతో ఎంత పెద్దక్షరాలు రాసిండో

అదుపు చెయ్యటానికి
అక్షరం అసెంబ్లీ కాదు.

పుదీనా చట్నీ
పువ్వసొంటి ముద్దు
యుద్ధస్పర్శ
శరీరంలో మొలకలెత్తి పులకిస్తయి

చరిత్ర కివతలప్పుడు
కవిత్వం రాసే ప్రతి సమయం
నా ముఖం బతుకుతుంది
చనుబాల ధారకు

*(కౌముదికి కన్నీళ్లతో...)*

*24 జనవరి 2004 ఉదయం*

కవి అంటే కాలే కట్టె కాదు
కట్టె కాలిన తర్వాత సుత
విస్తరిస్తున్న బతుకు వాసన

# బతుకు

జీవితం నిమ్మళించే లోపల
కాలం కబళిస్తది

సంకేతాలేవీ ఉండయి
రెప్పపాటులో మృత్యువు ముద్దాడుతది
'పైలం బిడ్డా' అని పల్లె దీవిస్తనే ఉంటది
రోడ్డు రక్తం రుచి మరిగింది
ఎంతయినా మానవరక్తం పీల్చే దేశాల
మహాధనంతో నిర్మించిన రోడ్డు

పదచిత్రాలు అల్లుకుంటూ
వాక్యం దూసుకెళ్తున్నప్పుడు
ధూమభూతం భయపెడుతుంది
ముఖం చిట్లిపోయినప్పుడు
కాగితం కలవళపడింది
అక్షరం కన్నీరొలికింది

తప్పిపోయిన నా ఆత్మీయ పద్యపేటిక
ఇప్పటికైనా దొరికిందని ఉబలాటపడ్డా
ఇంతల్నే భల్లుమనటం కుట్ర కాదా



ఏదీ కుదురుగా లేదిక్కడ
కలిసి పాడుదామనుకుంటిమా
కట్టపొంటి కళకళలాడే పొలాల్ని కలగందామనుకున్నమా
మన తల్లి మన మట్టితల్లి
చెక్కిళ్ల మీద చారికలు తుడుద్దామనుకున్నమా
ఇంతల్నే ఇందర్ని విడిచి యాడికెళ్లినవ్
కాగితం మీద కలలు రాసిన కవీ
రోడ్డు మీద ప్రాణగీతం రాసినవా
రాయలసీమ నేల మీద
తెలంగాణ రక్త చిత్రం గీసినవా

కాలం కాదు
బతుకే ఐసుముక్క
సున్నితంగా సుతారంగా సుందరంగా
కరిగిపోదామనుకున్నా
కరగకముందే చేజారి ముక్కలాయెనా
ఏ ముక్కలో నీ ముఖం వెదుకులాడాలె

బట్ట చుట్టిన నీ భౌతిక కాయం ముందు
మౌనంగా తలవంచి దుఃఖించటం మినహా
అశక్తున్ని అశక్తుణ్ణి

ఏడుపాయలు ఎక్కెక్కి ఏడుస్తుంది
స్మశానమని కూడా చూడకుండా
అంతటా బతుకువాసన గుబాళిస్తుంది
కవి అంటే కాలే కట్టె కాదు
కట్టె కాలిన తర్వాత సుత
విస్తరిస్తున్న బతుకు వాసన.

*('బతుకు వాసన' చంద్రశేఖర్ యాదికి...)*

పాతినవి మొక్కలు కాదు
రాతికనీలు
వసంతం అడుగిడినా అవి చిగురించవు

# కలత

తప్పిన అడుగుల్లో
తలలు నాటుతున్నాం

కంటున్న కల పూర్తికాకుండానే
దబుక్కున మెలకువొస్తుంది

ఇక్కడేదో హార్మోనియం పెట్టె పగిలినట్టు
శృతి విరిగిపోయింది
జానపదగీతం వినేతందుకు
జన్మభూమి మొరాయిస్తున్నది
ఊగిసలాటలో ఉడుకుతున్న జీవితం
చావువాసన సంతరించుకుంటున్నది

వానజల్లులు జల్లులుగా కురిసినా
మునుపటి వలె నేల పులకించటం లేదు

పాతినవి మొక్కలు కాదు
రాతికనీలు
వసంతం అడుగిడినా అవి చిగురించవు

తప్పిన దారుల్లో
కలలు వెదజల్లుతున్నాం



అష్టభుజి సందడిలో
ఉన్నభుజాలు పోతాయి
నిర్వాసితుల కన్నీళ్ళు
కంప్యూటర్‌ను చెమరించలేవు
నిండు సభలో
మనిషి శిరచ్ఛేదాన్ని ఆపేతందుకు
ఎవరూ ముందుకు రారు
అందరిదీ ఒకే తల
నమ్రంగా నాలుక తిప్పటమే ఇ-కళ

దూప తీరకముందే
నది అదృశ్యం
ఎక్కక ముందే కొండ అదృశ్యం

విషాదాలు మోసెతందుకయినా
తలలుండాలె
వివేచన చేసెతందుకయినా
తలలుండాలె
ఎవల భుజాల మీద
వాళ్ళ తలలే ఉండాలె

*24 ఏప్రిల్ 2007 మధ్యాహ్నం*

అభివృద్ధి అంటే రోడ్లే కదా
అభివృద్ధి అంటే శవాలే కదా
దాదాల మధ్య రాజీ ఉన్నట్టే
దేవుళ్ల మధ్య రాజీ ఉంటది

# భూమికిద్దరూ బిడ్డలే

వొంగి
మునివేళ్లతో మట్టిని తాకి
కండ్లకు అద్దుకున్నప్పుడు
భూమి పులకరించింది
మోకాళ్ల మీద కూచోని
నుదురు ఆనించి వినమ్రమైనప్పుడు
భూమి పరవశించింది

నువ్వూ అతనూ
భూమికిద్దరూ బిడ్డలే

పసిబిడ్డకు తినిపించటానికి
చెయి చాపి మీ అమ్మ రమ్మంటే
చందమామ దిగి వచ్చిండు
అతని కోసం వాళ్ల 'మా' పిలిస్తే
'చాంద్‌మా' ఆకాశం దిగొచ్చిండు
చందమామ కిద్దరూ వారసులే-

చెట్ల మీంచి వీస్తున్న గాలి తేడా చూడదు
రాళ్ల మధ్య ప్రవహిస్తున్న నీరు కినుక వహించదు



ఇయ్యాల్ల విస్తరిస్తున్న గాయానికి
భూమీ చందమామా కలిసి విలపిస్తున్నారు

మీరిద్దరూ మనుషులే అయినప్పుడు
మనుషులే రుతుచక్రం తిప్పాలిగానీ
త్రిశూలమెట్లా తిప్పుతుంది
తల్వారెట్లా తలరాత రాస్తుంది

పచ్చటి పట్టుబట్టలా పరుచుకున్న భూమ్మీద
నెత్తురు చల్లిన సన్యాసులు
మనుషుల మధ్య మసులుతుంటే
ఏ తల్లయినా తల్లడిల్లదా?

పొలమొదిలి ఇల్లొదిలి
దుకున మొదలి కన్న ఊరొదిలి పారిపోతంటే
భయపెడుతూ వెంటాడుతుంది భక్త ధర్మం
గాయం చేసిన రాయికి
నమస్కరించే సంస్కారం కదా
గర్భవతి పొట్ట చీల్చి
నెత్తుటి గుడ్డు కత్తిమొన మీద ఎగిరేసి
మజా చేస్తుంది
ఇంట్లో దాక్కున్న భయాంతరంగాన్ని
గ్యాస్ సిలిండర్‌తో పేల్చి
గర్వంగా జయధ్వానం చేయగలదు

డబ్బు ఎక్కడ గాయం చెయ్యాలో
డైరెక్ట్ చేస్తది
మార్కెట్ గాయం విధివిధానాలు నిర్ణయిస్తది
డబ్బా నిండితే చాలు
ఓట్ల డబ్బా పండితే చాలు
రాజ్యం గాయం వెంట నడుస్తుంది

రాజ్యం చూసినవా,
త్రిశూలం పట్టుకోని
సిలిండర్ పట్టుకోని
ఎలక్ట్రిక్ వైర్లు పట్టుకోని
బీభత్సంగా సంచరిస్తుంది

గాయపడిన శిబిరం చూసినవా,
బట్టలు చించి బలాత్కారం చేసి
భయపెడుతున్న మత పవిత్రతను
ఆమె ఆర్తనాదంలో ఆలకించవచ్చు
ఆసిడ్‌తో మాడిపోయి
కాలి ఒంటికంటిన దుస్తుల్ని లాగినట్టే
చర్మం ఊడి వస్తుంటే
నగ్నంగా పరిగెత్తిన నజ్మా కంటిపాపల వణుకులో
తరుముతున్న దైవభక్తిని వడకట్టుకోవచ్చు
బావిలోకి విసిరేయబడి
కన్నబిడ్డల్ని కోల్పోయి
తోటిస్త్రీలను కోల్పోయి
మక్సూదా నిర్వికారపు మూల్గుల్లో
కరసేవకారుల ఖడ్గాల్ని కనుక్కోవచ్చు

గోద్రాలో శవాలే
కుద్రాలో శవాలే
రైలుడబ్బా తగలబడ్డది
ఊరూర్లు తగలబడ్డయి
ఓట్ల డబ్బా గట్టివడ్డది
అందర్‌కీ బాత్ హై
పోలీస్ హమారా సాథ్ హై
శవం కింద శవాలు పాతిపెట్టు



మజార్‌లో దర్గాలో మాయం చేసి
రోడ్లు వేయొచ్చు

అందరికీ బాత్ హై
రాజ్ హమారా సాథ్ హై

అభివృద్ధి అంటే రోడ్లే కదా
అభివృద్ధి అంటే శవాలే కదా

దాదాల మధ్య రాజీ ఉన్నట్టే
దేవుళ్ల మధ్య రాజీ ఉంటది
రాముడు దాడి చేసేటప్పుడు
అల్లా ఆదుకోడు
అల్లా దాడి చేసేటప్పుడు
రాముడు ఆదుకోడు

తీరకపోతేనే దాహం
గాయం మీద గాయం
శవాల లెక్కలేదు
గాయాల లెక్కనే
మనిషి మరణించిన తర్వాత
అంతా గాయాల లెక్కే
గాయానికి కట్టుగట్టటానికి
మనిషిని కైగట్టటానికి
మనకున్నది మాటే
త్రిశూలాన్నీ తల్వార్‌నూ ఓడించేది
ఒక్క మాటే
ఒకే ఒక్క మాట

*7 జూన్ 2002 రాత్రి*

ముఖం చెల్లనివారే ముసుగు ధరిస్తారు

# మనసద్దాం

ముఖం చెల్లనివాడు ముసుగేసుకోవాలె
నీకేం?
నీది వీరుడి ముఖం
బాంబులతో బెదిరిస్తున్న బద్మాష్ చెంపల మీద
కత్తి గీత పెట్టిన సాహసి ముఖం

ఉరితాడు మెడ చుట్టూ బిగించిన తర్వాత కూడా
భయపెట్టగల తేజోమయ ముఖం
నీకేం?

మోసం చేసినవారే ముసుగు ధరిస్తారు
ముఖాలకు ముసుగులు ధరించిన తలారులెవరో
ప్రపంచ ప్రజలు పోల్చుకున్నారు

ముఖం చెల్లని బుష్
ముఖమే లేని బ్లెయిర్
ఆయిల్ దోపిడీలో ఆరితేరిన ప్రభువులు

ముఖం చెల్లనివారే ముసుగు ధరిస్తారు
మనిషినీ భూమినీ చెరబట్టిన నియంత నీలినేత్రం
నిన్నేం చెయ్యగలదు
నువ్వెప్పుడో హృదయసీమల్లో వెలుగుతున్నావు



మరణాన్ని కూడా చరిత్ర చెయ్యగలిగినవు
ఉరితాడును కూడా పూలమాలగా ధరించగలిగినవు
నీకేం?
ముఖం లేనివానితో
ఇంగితం లేని జై కొట్టించుకున్నందుకు
మెక్తబా సిగ్గుపడాలె
సముద్రం మీది అలల్ని చూసి పారొచ్చి దాక్కున్న
పిరికివాడిని మోస్తున్నందుకు
వైట్‌హౌస్ సిగ్గుపడాలె
నీకేం?
నీది ధీరముఖం
నియంత నెదిరించి నిలిచిన నిర్భీతి ముఖం

సమయం రానీ అంటున్న టైగ్రిస్ నదికి
కొత్త కాంతులద్దింది నువ్వు
తిక్రిత్ పట్టణం పఠించే ఖురాన్ పేజీల నిండా నువ్వే
సంకీర్ణ సేనలకు చిక్కకుండా
బాగ్దాద్ బాలలు తయారుచేసే
రసాయనిక ఆయుధం నువ్వే
సామ్రాజ్యవాదాన్ని టార్గెట్ చేసి
సంధించిన మిసైల్ నీ ముఖం
నీకేం?
సద్దాం
అంతటా నీ ముఖమే
అంతెందుకు?
అదురుతున్న బుష్ ఎడమకంటిలో
పదే పదే
నీ ముఖమే

*9 జనవరి 2007 సాయంత్రం*

తుపాకులు పట్టుకొని నాట్యం చేసేవాళ్లు
శత్రువును పోల్చుకోలేరు

# వీరుల వరుస

ఏ గాలి అవమానించినా
ఏ భూమి ఎంతోకాలం భరించలేదు
యూఫ్రటిస్ నది గుండెల మీద కుమ్మిన
నావికుడికి నీతిలేదు
చమురు నిల్వల మీద స్వైరవిహారం చేసే
లాభపిపాసికి లోకభీతి లేదు
నీటికోసం మన సమరం
చమురుకోసం వాని సమరం
డాలర్‌కూ యూరోకు అసలు ఘర్షణ
రసాయనిక ఆయుధం ముసుగు మాత్రమే
బాగ్దాద్‌ను బంధించి
ప్రజాబోనులో దోషిగా నిలబడ్డాడు వాడు
కోర్టులు 'కీ' బొమ్మలు
తలారులు కీలుబొమ్మలు
ఉరిఘట్టంలో ఎక్కడా ఉదాత్తత లేదు
వైట్‌హౌజ్‌కూ గ్రీన్‌హౌజ్‌కూ మధ్యన
డిజిటల్ వంతెన కనబడకపోవచ్చు
ఇప్పటికిప్పుడు గ్రీన్‌హౌజ్ నిజం చెప్పకపోవచ్చు



తుపాకులు పట్టుకొని నాట్యం చేసేవాళ్లు
శత్రువును పోల్చుకోలేరు
తిక్రిత్ మౌనంగా తలదించుకుంటుంది
వైట్‌హౌజ్ పల్లకి
ఒహోం హోం అంటూ మోయటానికి
ప్రపంచదేశాలు సిగ్గుపడాలి
ఉచితార్థంగా ఉరితీసినప్పుడు కూడా
మాట్లాడని మల్లెమొగ్గ ప్రభువులు
ఇంకెప్పుడు మాట్లాడరు

గుమ్మటాల మీద వాలిన పక్షులు
గుసగుసలాడుతున్నాయి
ఆధిపత్యాన్ని ఎదిరించిన వీరుడికి
మాలలు కడుతున్నాయి
నియంతను నిలదీసిన నేత కోసం
ఖర్జూరాలు జానపదాలు అల్లుతున్నాయి

ఉరితీసి వాడు
నియంతల జాబితాలో చేరాడు
ప్రాణాన్ని సుమప్రాయంగా విసిరి సద్దాం
వీరుల వరుసలో ఉదయించాడు

*27 జనవరి 2007 ఉదయం*

జవాబులు ఉండవు
ప్రశ్నలు కూడా ఉండవు
సర్దుబాట్లే సవాలక్ష సర్దుబాట్లు

# నల్లపూస

అతుక్కుంటయ్ గని
మొఖంలోని దుఃఖం
బొట్టుబిళ్లల కే మెరుక

తొవ్విపోస్తయ్ గని
మట్టిగుండెల మూలుగులు
జేసీబీల కే మెరుక

ఎరుక తప్పింది
సరుకుల మధ్య ఉరుకుల మధ్య
ఒకరికొకరు ఎరుకలేదు
ఎవరికీ ఏదీ ఎరుకలేదు

జవాబులు ఉండవు
ప్రశ్నలు కూడా ఉండవు
సర్దుబాట్లే సవాలక్ష సర్దుబాట్లు
కొంచెం కొంచెం సగం సగం సొంతం ఆసొంతం

మునుగు నిండా మునుగు
తెగి చెదరిపడిన నల్లపూసల మధ్య
ఎక్కడని దేవులాడుతవ్



ఈ చెమ్కిల మధ్య
మనసే నల్లపూస
వెన్నుపూస లేదు
వెన్నపూస లేదు

పారిపో పాడైపోయెను ఊరు
జ్ఞాపకాలకు తడుకపెట్టు
ఇంకా ఆత్మలేమిటి?
అసొంటిదేది మిగిలి ఉన్నా
ఇప్పుడే పొక్క తవ్వి పాతిపెట్టి
ఇంత మట్టి చల్లు

తడిలేదు తడిలేదు
విడిపో
పేగుముడి తెంపుకో
తాడనకు తలుగనకు
మడికట్టనకు
తెలిసిన నేల మీద
తెలియని లిపిలో బాధపడకు

ఊరును సాదిన చెరువులో
ముడ్డి కడగటానికి నీళ్ళు లెవ్వు

ఏం బతుకు
పారిపో
ఉన్న ఊర్లో ఉండి ఎవడు బాగుపడ్డడు
ఉన్న దేశంలో మాత్రం ఎవడు బాగుపడ్డడు
పారిపో పట్నానికో పరదేశానికో
ఈడ తప్ప యాడికన్నా పో
ఇట్ల తప్ప ఎట్లన్నా బతుకు
బ్రోకర్ దందా

ఐట్రో దిద్దుకొని బతుకొచ్చు
కిరాయి హంతకుని కిరీటం పెట్టుకోనైనా బతుకొచ్చు
ఫ్లైఓవర్ల కింద పార్కింగ్ ఫీజు వసూలు చేసుకోని బతుకొచ్చు
హైవే బ్రిడ్జిల దగ్గర ఏండ్ల తరబడి టోల్‌టాక్స్
వసూల్చేస్కోని బతుకొచ్చు

కానీ కానీ
ఎందుకాలస్యం
అమెరికాలో బతుకుతున్నామన్నదే ఇంపార్టెంట్
ఇంటర్నెట్ తట్టు ఇండస్ట్రీ పెట్టు
బ్యాంకు పెట్టు ఐపీ పెట్టు
బట్- సెకండ్ సెటప్ ఉందా లేదా అన్నదే ఇంపార్టెంట్

దేనికీ సిగ్గుపడకు
మహా మహా మంత్రులే సిగ్గుపడటం లేదు
దేశాధినేతలే భిక్షాటనకు బయల్దేరారు
బయల్దేరు అర్జెంట్
జల్ది బయల్దేరు
ప్రపంచబ్యాంకు మూస్తారో ఏమో
వరల్డ్ ట్రేడ్‌సెంటర్ కూలిపోతుందేమో
ఏమో- ఏమైనా జరగొచ్చు
చెప్పలేం, వైట్‌హౌస్‌కేమయినా జరగొచ్చు
వైట్ కాలర్లయినా వైట్ ఎలిఫెంట్లయినా
ఏదయినా జరగొచ్చు

పారిపో
హెలికాప్టర్ సిద్ధంగా ఉంచుకో
అన్నీ మరిచిపో
ఏదీ జ్ఞాపకం పెట్టుకోకు
ముఖ్యం
నువ్వు మనిషివని ఎట్టి పరిస్థితిలోనూ జ్ఞాపకం పెట్టుకోకు

*23 ఫిబ్రవరి 2002 రాత్రి*



ప్రపంచబ్యాంకు చంకలోంచి
జాతీయ శంఖారావం వినపళ్ళేదా?
జెండా ఏమెగరేస్తవ్?
డాలర్ కలతో కాలరెగరేయ్

# బంగారు కల

ఆకాశం నుండి
దిగుతున్న
అందమైన కల
తలాతోకా లేకపోయినా
తళతళలాడుతుంది కల
ఇంకెప్పుడు నిట్టూర్పులు
నీ మెడకు చుట్టుకోకు
చీరలూ, చున్నీలు మర్చిపో
సన్నదైంది నాజూకైందీ మెడ
మెడ పొడుగ్గా చాచి కలనందుకోవటం నేర్చుకో
కలకెటూ తలలేదు గనక
నీ తలకు రిబ్బన్‌లా చుట్టుకోవచ్చు
ఆగిన ఏ కారు అద్దంలోనో చూసుకోవచ్చు
దువ్వినప్పుడల్ల
వెంట్రుకలు ఊడి వస్తున్నయని బాధపడనక్కర్లేదు
కలనడుగు
మహత్తరమైన మంత్రరసం ఇస్తుంది.

ఇగ నల్లగ దట్టంగా వెంట్రుకలే అన్ని!
రూపచ్ఛాయ గురించి
బీపీ పెంచుకోనక్కర్లేదు
అట్ల ఓరచూపు చూస్తే
అన్ని ఛాయలు నీ ముందు లైను కడతయి
ఫెయిర్ క్రీము వాడమ్మా
పెళ్ళి అదే అయిపోతది
మనమెందుకిక బాధపడటం?
మనకోసం కల అవతరించింది
ఉనికి కోసం ఉద్యమమక్కర్లేదు
పుస్తకాలు యూనివర్సిటీలు పట్టుకొని
గడ్డాలూ మీసాల నడుమ ఎంతకాలం గడ్డకట్టుకపోతవ్
ఒక్కసారి కలను అర్థించు
సరికొత్త వస్త్రధారణతో
సంపూర్ణ మానవునివైపోతవ్
అరవటం పోరాడటం ఎందుకు? దండగ
అద్భుతమైన కల అండనుండగ
జెండాల్ పడుతావ్
ధర్నాలు చేస్తవ్
ప్రాణాల్ ధారపోస్తవ్
దొరికిందా స్వేచ్ఛ
కలను స్మరించుకో
వాహనం స్వేచ్ఛ ప్రసాదిస్తది
అవమాన భారానికి ఆత్మహత్యలేల సామి
సామేషమేసుకో
సగం కల నీకు సలామ్ చేస్తది
ప్రపంచబ్యాంకు చంకలోంచి



జాతీయ శంఖారావం వినపళ్ళేదా?
జెండా ఏమెగరేస్తవ్?
డాలర్ కలతో కాలరెగరేయ్

కలంటే కల
బుద్ధిజీవులు శుద్ధి చేసిన కల
బడుగుజీవుల సుకృతం కల
బూడిద చేయగలదు
బంగారం చేయగలదు
టైగర్ చేయగలదు
క్యాట్ చేయగలదు
కలంటే కల
వింతయిన కల
విశ్వసుందరి బుగ్గమీది సొట్టలాంటి
మనోహరమైన కల
అటు
ఆకాశం నుంచి
అందంగా దిగుతున్నది
కాచుకో

*6 జూన్ 2003 సాయంత్రం*

కర్మభూమిలో పుట్టినందుకు
అమెరికా అధ్యక్షుని పటం పెట్టుకొని
అందరం భావాతీత ధ్యానమే చేద్దాం

# కొన్ని పాఠాలు

అవున్నిజం
పతంగులే ఎగరేద్దాం
పంతుళ్లు పాఠాలు చెబితే
పరిస్థితులు అర్థం కావచ్చు
విద్యార్థులు ప్రమాదం పసిగట్టొచ్చు
పాలకులకు చెమటలు పట్టించొచ్చు
ఎందుకైనా మంచిది
అందరం పతంగులే ఎగరేద్దాం
స్వర్ణాంధ్రబొమ్మ గీసిన
రంగుల పతంగులే ఎగరేద్దాం

అవున్నిజం
ధ్యానమే చేద్దాం
ముసుగో లొసుగో బయటపడొచ్చు
ప్రశాంతత చెడవచ్చు
ఆరోగ్యం పాడవొచ్చు
ఎందుకైనా మంచిది
మనం ధ్యానమే చేద్దాం



కర్మభూమిలో పుట్టినందుకు
అమెరికా అధ్యక్షుని పటం పెట్టుకొని
అందరం భావాతీత ధ్యానమే చేద్దాం
చిత్తం చిత్తం
కంప్యూటరే వాడదాం
జీవరాశులైతే గడ్డిమేయవచ్చు
జాతకాలు తలకిందులు చేయవచ్చు
వైరస్ వస్తది గాని
వైరం పెట్టుకోదు గదా
ముఖ్యంగా డిఏ పెంచుమని అడుగదు గదా
ఎందుకైనా మంచిది
మనం కంప్యూటరే వాడదాం

అవున్నిజం
కండోమ్‌లే ధరిద్దాం
చేసేది పక్కా బిజినెస్సాయె
పక్క ఉండాలె గదా
ఏ పులిరాజులకో ఏ పులిరాణులతో
ఏదో సంబంధమేర్పడవచ్చు
ఏమో ఎయిడ్స్ వెంటబడొచ్చు
ఎందుకయినా మంచిది
అందరం కండోమ్‌లే ధరిద్దాం
మాటలంటూ నేర్చినందుకు
సిగ్గువిడిచి చట్టసభలో
కండోమ్‌ల గురించే మాట్లాడుదాం

అవున్నిజం
చరిత్ర తీసేద్దాం

మనిషున్న తర్వాత
మంచీచెడూ ఉండొచ్చు
చదివితే రెండూ తెలవొచ్చు
పట్టింపులెందుకు
పైకి రావటమే సత్యం
కుట్రలు తెలవొచ్చు
రాజ్యాలు కూల్బడమూ తెలవొచ్చు
ఎందుకయినా మంచిది చరిత్రను తీసేద్దాం
పఠనీయమే కాని చరిత్రను తీసి పారేద్దాం

నిజం నిజమే
మైండ్‌సెట్ మారాలి
మార్కెట్ ఇంత అభివృద్ధి అయినా
మనం ఇంత ముందుకు పోయినా
మనుషుల ఆలోచనా సరళి మారటం లేదు
ఎగనామం పెట్టినా ఫర్వాలేదుగాని
పుట్టినందుకు ఎంతైనా అప్పు చేయాలి
ఇంటర్‌నెట్ చూసైనా మన మైండ్‌సెట్ మారాలి
మాసిన బట్టలు మార్చమా?
కాలం చెల్లిన ఇజాలు విడిచి
మన మైండ్‌సెట్ మారాలి.

*26 జనవరి 2004 సాయంత్రం*